

# విచారచన్ద్రోదయసారము

సంపాదకులు:

శ్రీ స్వామి బ్రహ్మానందజీ

సహాయకులు:

శ్రీ మహాత్మా ఆత్మానందజీ

ఆంధ్రానువాదకుడు:

'సాహిత్య - వేదాన్తాచార్య' కృష్ణచరణ్



ప్రకాశకులు:

శ్రీ ధ్యానప్రకాశానందస్వాములవారు



దీని వెల ] 1954 [ 0-4-0

వలయువారు:- శ్రీ వ్యాసాశ్రమము, ఏర్పేడుపోస్టు, చిత్తూరుజిల్లా.
అని వ్రాసిన బడయగలరు.

ఓమ్

శ్రీసద్గురు శ్శరణమ్.

# పీఠిక.

శ్రీ పండిత పీతాంబర్ జీ విరచితములైన 'విచారసాగర, విచార చన్ద్రోదయ, వృత్తిప్రభాకరము'లను ఉత్తమ వేదాన్త ప్రక్రియాగ్రంథములు ఉత్తరభారతదేశమున మిక్కిలిప్రసిద్ధములై ప్రచారముననున్నవి. ఈ గ్రంథములందు శాస్త్రీయములైన వేదాన్తవిషయములన్నియు చక్కగ సరళమైనభాషలో వివరముగ ఉదాహరణములతో పండితపామరుల కందరికిని విదితమగు లాగున వివరింపబడినవి. విశేషించి 'పంజాబ్' ప్రాంతమున జిజ్ఞాసువులగు గృహస్థులకు స్త్రీ పురుషులందరికిని యీ గ్రంథములు కంఠస్థములై ఉండును. వారలలో భక్తిశ్రద్ధలు, సాధు సేవానురక్తి, సత్సంగప్రీతి మెండు. కనుకనే యెవరేని సంన్యాసులేతెంచిన వారిని యథోచితముగ సత్కరించి సత్సంగమును సలుపుచు వారిని గొప్పగొప్ప శాస్త్రీయప్రశ్నలు వేయుదురు. చూపరుల కాశ్చర్యము గొలుపును. వారందరు యీ హిందీ గ్రంథములనే చదివి, మననముచేసి అట్టి శాస్త్రీయవిషయముల నన్నిటిని తెలుసుకొనగలిగిరి.

నిజముగ శాస్త్రీయపద్ధతితో సంపూర్ణ వేదాన్త ప్రక్రియను తెలుసుకొనవలయునన్న యీ మూడు గ్రంథములు మిక్కిలి సహాయకరములగును. 'విచారసాగరము' 'విచారచన్ద్రోదయము' యీ రెండు గ్రంథములు మాత్రము చిరకాలముననే శ్రీ జనార్దనస్వామి చైతన్యులచే ఆంధ్రీకరింపబడినవి. వృత్తి ప్రభాకరముగూడ ఆంధ్రమున పూర్వము ముద్రితమైయుండెను.

ప్రస్తుతము దొరకుటలేదు. కాని అవి మన ఆంధ్రదేశమున కావలసినంత ప్రచారములో లేవు.

ఇంత మాత్రమున మన ఆంధ్రదేశము ఆధ్యాత్మిక పథమున వెనుకబడియున్నదని అనుటలేదు; అనుకొనరాదు. బృహదాంధ్రాధ్యాత్మిక కేంద్రమగు శ్రీ వ్యాసాశ్రమ సంస్థాపకులైన శ్రీ శ్రీ శ్రీ మహర్షి సద్గురు మలయాళస్వాములవారి చిరంతనాధ్యాత్మిక ప్రచారముచేతను, నిరంతర వేదాన్త ప్రబోధముల చేతను, మఱియు నితరులగు అనేకమంది మహనీయుల ధర్మోపదేశములచేతను యీనాడు మన ఆంధ్రదేశమున వేలకు వేలు ఆధ్యాత్మిక కేంద్రములు, ఆశ్రమములు నెలకొని, తద్ద్వారా అనేకమంది ఉత్తమోత్తములగు సాధకులు, జిజ్ఞాసువులగు భక్తులు యేర్పడిరని తెలుప యెంతయో సంతసముగనున్నది. మన ఆంధ్రదేశీయ సాధకులలో జిజ్ఞాసువులలో పవిత్రసాధనానుష్ఠానపరులున్నను శాస్త్రీయ వేదాన్త ప్రక్రియావిచారణ మాత్రము తక్కువని అంగీకరింపక తప్పదు. సాధనానుష్ఠానముతో పాటు 'వేదాన్తవిచారణ' గూడ తోడైనచో, సాధకుని మనోవృత్తి బహిర్గతముకాక నిరంతరము అంతర్ముఖమై బ్రహ్మచింతన పరమై ఉండగలదు. కాన వేదాన్తప్రక్రియను బోధించు చిన్న చిన్న సరళగ్రంథము లెంతేని అవసరము. ఈ చిన్నపొత్తము ట్టి అవసరమును తప్పక తీర్చగలదనియే నా యాశ.

పూర్వోక్త 'విచారచన్ద్రోదయ' గ్రంథమునే సంగ్రహించి శ్రీస్వామి బ్రహ్మానందజీ, శ్రీస్వామి ఆత్మానందజీ అను యిరువురు మహాత్ములు హిందీభాషయందు 'విచారచన్ద్రోదయసార' మను

పేరుతో ఒక చిన్నపుస్తకమును రచించిరి. ఆ పుస్తకము యెటులో మా పూర్వ పరిచితులగు శ్రీ ధ్యానప్రకాశానందస్వామిగారికి లభించినది. దానిని చూచినదిమొదలుకొని వారికి సరిగ అర్థము కాకున్నను వేదాన్త ప్రక్రియాగ్రంథమగుటచే తెలుగున అను వదించి ప్రచురించిన అనేకమంది ఆంధ్రసోదరులకు, ఉత్తమసాధ కులకు ఉపయోగింపగలదని సదుద్దేశము గలిగినది. క్రిందటివేస విలో నేను తెనాలిలో వారికి కనిపింపగా హఠాత్తుగ యీ కార్యమును నాపై నిడిరి. ఇయ్యది మిత్రకార్యము, లోకోప కారము నగుటచే కాదనజాలనైతిని. కాని స్వీకరించియు అనేక కార్యాంతరములచే అవకాశము లభింపక త్వరలో భక్తుల నెదుట నుంచజాలకపోయినందులకు విచారించుచున్నాను. అయినను శ్రీ గురుదేవుని యనన్యానుగ్రహముచే యీ 'చాతు ర్మాస్యమహావ్రత' పుణ్యకాలముననే దీనినందజేయగలుగు చున్నందులకు కృతకృత్యునిగా భావించుచున్నాను.

దానములలో విద్యాదాన మతిశ్రేష్ఠమైనది. విద్య అనగా ఆత్మజ్ఞానము. విశేషించి యీ చాతుర్మాస్య పుణ్యకాలమున జ్ఞానాగారమగు యీ చిన్నపుస్తకమును ప్రచురించి జిజ్ఞాసులకు, సాధకులకు, భక్తులకు అర్పించుచున్న శ్రీ ధ్యాన ప్రకాశానంద స్వామిగారు మిక్కిలి ధన్యులు. నిజముగ వారు జ్ఞానదాతలుగనే భావింపబడగలరు. శ్రీ గురుదేవుని అనుగ్రహముచే వారు యితోధిక ధర్మబుద్ధిగలిగి బ్రహ్మజ్ఞానసంపత్తిని లోకమునకు కలుగజేయుదురుగాక. ఈ సత్కార్యప్రేరకులైన శ్రీ ధ్యాన ప్రకాశానందస్వామిగారును మిక్కిలి సంస్తుత్యులు.

ఈ పొత్తము చూచుటకు చిన్నదే అయినను దీనియందు సంపూర్ణ వేదాన్తసారము యిమిడియున్నదనుటలో సందియము లేదు. సూక్ష్మములో మోక్షముగలదన్న అతిశయోక్తిగాదు. కాన ఆంధ్రాధ్యాత్మికసాధకులు, భక్తులు, జిజ్ఞాసువులు అందరు యీ ఉత్తమ గ్రంథరత్నమును ప్రేమతో స్వీకరించి, తత్త్వమును గ్రహించి కృతార్థులు కాగలరనియే నాయాశ. అపుడే నా యీ ప్రయత్నము సఫలమైనటుల భావించెద. అవసరమగు చోటులందు కేవలానువాదమేగాక విషయమును విశదీకరించుటకై విస్తారదోషమును పాటింపక యథామతి ప్రయత్నించితిని. బుద్ధిమాంద్యముచే అనువాదమున దోషములేవేని సంభవించిన పాఠకులు ప్రేమతో మన్నింతురుగాక.

జయ్ గురుదేవ్.

శ్రీ పరివ్రాజక మహామండలి,
లక్ష్మీకుండ్, కాశీ,
5—9—54.

కృష్ణచరణ్.



ఓం

శ్రీ సద్గురు పరమాత్మనే నమః

# విచారచన్ద్రోదయసారము

---

దోహా॥ హోయ్ మోక్ష్ దృఢజ్ఞాన్ సే ఇస్ కా హేతు విచార్।
దృశ్య్ అసత్ మాయారచిత్ జీవబ్రహ్మ నిర్ధార్॥ 1

తా॥ వేదాన్తశాస్త్రమున సకలదుఃఖనివృత్తి, పరమానంద ప్రాప్తియే మోక్షమని చెప్పబడెను. లోకమున సమస్తప్రాణులు నిరంతరము యీ దుఃఖనివారణమును, ఆనందప్రాప్తినే కోరు చున్నవి. వీటిని పొందుటకు కారణము బ్రహ్మజ్ఞానము. అజ్ఞానము పరోక్షము, అపరోక్షము అని రెండువిధములు. సద్గురువుచే విన్నట్టి అవాంతర వాక్యములవలన పరోక్షజ్ఞానము గలుగును. అపరోక్ష జ్ఞానమున్ను దృఢము, అదృఢము అని రెండువిధముల బేర్కొన బడినది. సద్గురువుచే నుపదిష్టమగు మహావాక్యముయొక్క శ్రవణ ముచే ముందు అదృఢమగు అపరోక్షజ్ఞానము గలిగి, తరువాత విచారణ అనగా నిరంతరాభ్యాసముచే దృఢమగు అపరోక్ష జ్ఞానము గలుగును.

ఈదృశ్యమాన సమస్త జగత్తు అవిద్యాకార్యమగుటచే అసత్తు, జడము, దుఃఖరూపమునై యున్నది.

జీవుడు సదా బ్రహ్మతో అభిన్నుడు. దీనికి కారణమేమన – వేదవేదాంతములందు జీవుడు, బ్రహ్మ యిరువురు సచ్చిదానంద స్వరూపులుగ వర్ణింపబడిరి. కాని అజ్ఞానమువలన ఉపాధికృత

భేదములు జీవునియందు ప్రతీతములగుచున్నవి. వాస్తవముగ జీవ బ్రహ్మలకు భేదము లేనేలేదు.

అవతారిక:— ఏ ఆరోపావస్థయందు జీవబ్రహ్మలకు భేదము ప్రతీతమగుచున్నదో అట్టి ఆరోపము క్రింద నిరూపింప బడుచున్నది.

దోహా॥ షట్ అనాది యహ్ జాన్ ఇవ్
జగ్ ఆరోప్ అపవాద్ ।
అసత్ వస్తు సబ్ బాధకర్
గురు లఖ్ బ్రహ్మ ప్రసాద్ ॥ 2

తా॥ శుద్ధబ్రహ్మ, ఈశ్వరుడు, జీవుడు, ప్రకృతి, ప్రకృతితో జీవేశ్వరుల సంబంధము, జీవేశ్వరుల పరస్పరభేదము, ఈ ఆరున్ను అనాదిపదార్థములు. ఇందు శుద్ధబ్రహ్మమాత్రము అనాది, అనంతము (నాశరహితము). తక్కిన యీశ్వరాది పంచపదార్థములు అనాదులు, సాంతములు (నశించునట్టివి).

జీవ ఈశో విశుద్ధా చిత్తథా జీవేశయోర్భిదా ।
అవిద్యా తచ్చితోర్యోగః షడస్మాకమనాదయః ॥

ఈ శ్లోకము పూర్వోక్తార్థమునే బోధించుచున్నది.

పరమేశ్వరుని సంకల్పముచే ఆకాశాది పంచమహాభూతములు సృష్టింపబడినవి. ఆ అపంచీకృత మహాభూతములవలన సమష్టివ్యష్టిరూపమైన సూక్ష్మజగత్తు సృష్టింపబడినది. తరువాత పంచీకృత మహాభూతములచే సమష్టివ్యష్టిరూపమైన స్థూల జగత్తు సృష్టింపబడినది. ఈశ్వరుని ఉపాధిభూతమగు శుద్ధసత్త్వాత్మక మాయ ఏకమై వ్యాపకమైనది. కనుకనే యీశ్వరుడును

ఒక్కడును, సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడునునై యున్నాడు. జీవోపాధియగు అవిద్య మలినము, పరిచ్ఛిన్నము, అనేకమునై యున్నది. కనుక జీవులును అనేకులు, పరిచ్ఛిన్నులు, అల్పజ్ఞులు, అల్పశక్తిమంతులు, కర్తృత్వ భోక్తృత్వములతో పరతంత్రులునునై యున్నారు.

పూర్వోక్తమగు యీ సమస్త ఆరోపము స్వప్నసృష్టివలె అసత్యమైనది. సద్గురువుయొక్క అనుగ్రహమువలన మూడు శరీరములకు సాక్షియైన జీవేశ్వరైక్యజ్ఞాన నిశ్చయమగును.

అవ:— జీవబ్రహ్మైక్య నిశ్చయప్రకారము వర్ణింపబడుచున్నది.

దోహా॥ మైఁ సాక్షీ త్రయ్ దేహ్ కా థూల దేహ్ పంచాన్।
కృత అపంచీలింగవపు కారణదేహ అజ్ఞాన్॥ 3

తా॥ నేను మూడు దేహములకును సాక్షిని. ఈ మూడు దేహములు స్వప్నమువలె అసత్యములు. స్థూలదేహము పంచీకరణమువలన కలిగినది. అనగా ఆకాశాది పంచమహాభూతములలో ఒక్కొక్కటి ప్రథమమున రెండుగ విభజింపబడి, అందు ఒకభాగము (అనగా సగభాగము) నాలుగు భాగములుగ విభజింపబడినది. కాన పంచమహాభూతములయొక్క అర్ధభాగములు మాత్రము శుద్ధమైనది. అనగా యితరభూతాంశములతో కలయిక లేనివనిభావము. తక్కిన అర్ధభాగములు మిగిలిన నాలుగు భూతాంశములతో గూడినవి. ఈ విధముగ ప్రథమమున అపంచీకృత మహాభూతములు పంచీకృతములాయెను. ఈ పంచీకరణముకాక పూర్వము అపంచీకృత మహాభూతములయొక్క అవిభక్తసత్వాంశముచే మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అను అంతఃకరణ చతుష్టయము ఉత్పన్నమాయెను. మఱియు ప్రత్యేకమహా

భూతములయొక్క పృథగ్భూత సత్త్వాంశముచే క్రమముగ శ్రోత్ర, త్వక్, నేత్ర, జిహ్వా, ఘ్రాణములను పంచజ్ఞానేంద్రియము లుత్పన్నములైనవి. అట్లే అపంచీకృత మహాభూతములయొక్క అవిభక్త రజోఽంశమునుండి పంచప్రాణము లుత్పన్నములైనవి. మఱియు ఆయా మహాభూతములయొక్క ప్రత్యేక రజోఽంశము నుండి పంచకర్మేంద్రియము లుత్పన్నములైనవి. ఈ పందొమ్మిది తత్త్వములుకలిసి సూక్ష్మశరీరమనబడును. మూలాజ్ఞానమే కారణశరీరము. స్థూలసూక్ష్మ శరీరములరెండింటికి కారణమగుటచే దీనికి కారణదేహమని సంజ్ఞ కలిగినది.

అవ:— ఇక యీ మూడు దేహములయొక్క అవాంతరభేదములగు పంచకోశములు నిరూపింపబడుచున్నవి.

దోహా॥ అన్న ప్రాణ విజ్ఞాన మన్ పంచకోశ ఆనంద్ ।
సభీ అసజ్జడభేదయుత్ సత్ చేతన్ సుఖకంద్ ॥ 4

తా॥ అన్నమయము, ప్రాణమయము, మనోమయము, విజ్ఞానమయము, ఆనందమయము అని కోశములు అయిదు. అనగా స్థూలదేహము అన్నమయకోశము. సూక్ష్మదేహమున ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయములను త్రివిధకోశములు గలవు. కారణదేహము ఆనందమయకోశ మనబడును.

ఈ అయిదు కోశములును అసద్రూపములు, జడములు, మఱియు పరస్పర భిన్నభిన్నధర్మములు గలవి. ఎట్లన, అన్నమయకోశము జన్మకంటెముందును, మరణముకంటె తరువాతను ఉండుటలేదు. ఇక ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశములు మూడును అవిద్యాకార్యములగుటచే క్షణికములు, చంచలములు, అత్యంతవికారములునునై యున్నవి. ఆనందమయ

కోశమున్ను దృశ్యమగుటచే, మిథ్యయే యగును. సద్రూపమగు చైతన్యమొక్కటే నిరతిశయసుఖ స్వరూపమై ఆనందఘనమై యున్నది.

'నేను సాక్షిని, శుద్ధబ్రహ్మస్వరూపుడను, ఈ కోశముల కన్నిటికిని సత్తను (ఉనికిని), స్ఫూర్తిని (ప్రకాశమును) యిచ్చు నట్టి పరమానందస్వరూపుడను నేనే' అను నిట్టి విచారణచే ముముక్షువులు పంచకోశములనుండియు, జాగ్రదాది త్రివిధావస్థల నుండియు తాదాత్మ్య (అభేద) సంబంధమును పరిత్యజింప వలయును.

అవః—ఈ దిగువ శుద్ధబ్రహ్మస్వరూపము నిరూపింపబడుచున్నది.

దోహా॥ జాగ్రత్ స్వప్న సుషుప్తి యహ్
అసత్ దృశ్య వ్యభిచార్ ।
తుర్యాపద మైఁ జ్యోతిమయ్
బ్రహ్మతమ నిజసార్ ॥ 5

తా॥ జాగ్రదాది త్రివిధావస్థలకును, అన్నమయాది పంచకోశ ములకును పరస్పర భేదముగలదు. అనగా జాగ్రదవస్థయందు స్వప్నములేదు. స్వప్నమునందు జాగ్రత్సుషుప్తులులేవు. అట్లే సుషుప్తియందు జాగ్రత్స్వప్నములులేవు. కాని సాక్షియగు ఆత్మయొకటియై సర్వావస్థలందును అన్వితమైయున్నది. కనుకనే ఆత్మ సర్వానన్వయి యనబడును.

ఎచట చతుర్దశత్రిపుటిచే లోకవ్యవహారము సిద్ధించునో నయ్యదియే జాగ్రదవస్థయనబడును. చతుర్దశత్రిపుటియనగా — అంతఃకరణచతుష్టయము, దశేంద్రియములుకలిసి యివి పదు నాలుగు అధ్యాత్మమనబడును. వీటికి ప్రేరకులైన బ్రహ్మాది

చతుర్దశదేవతులు అధిదైవమనబడును. శబ్దాదిచతుర్దశ విషయములు అధిభూతమనబడును.

జాగ్రదవస్థయందు జీవునిస్థానము నేత్రము. ఈ అవస్థయందు జీవుడు వైఖరీవాక్కు, స్థూలభోగము (స్థూలశరీరముతో విషయముల ననుభవించుట) క్రియాశక్తి గలిగియుండును. మఱియు జీవుడీ అవస్థయందు రజోగుణాభిమానియగు విశ్వుడనబడును.

పూర్వానుభూత పదార్థములయొక్క సంస్కారములచే జన్యమై 'హిత' (సుషుమ్న) అను నాడియందు అస్పష్టముగ భాసించునట్టి అవస్థ స్వప్నమనబడును. ఈ అవస్థయందు జీవునికి స్థానము కంఠము. మధ్యమవాణి, సూక్ష్మభోగము, జ్ఞానశక్తి గలిగియుండును. ఈ అవస్థయందు జీవుడు సత్వగుణాభిమానియైన తైజసుడనబడును.

ఎచట సమస్తత్రిపుటియు, తత్కృత సంపూర్ణవ్యవహారమున్ను లయమగునో నయ్యది సుషుప్తియగును. దీనియందు జీవుని స్థానము హృదయము. పశ్యన్తీవాక్కు, ఆనందభోగము, ద్రవ్యశక్తి గలిగియుండును. ఈ అవస్థయందు జీవుడు తమోగుణాభిమానియైన ప్రాజ్ఞుడనబడును.

ఈ పైనజెప్పిన మూడవస్థలును అసద్రూపములు, జడములు, దుఃఖరూపములు; మఱియు భ్రాంతిసిద్ధములు.

ఈ సమస్తదృశ్యము జ్ఞానకాలమున తురీయమగు జ్యోతిస్స్వరూప బ్రహ్మాత్మతో అభిన్నముగ భాసించును. ఆ బ్రహ్మాత్మయే అంతటికిని అధిష్ఠానమై సత్యస్వరూపమై వెలుగొందుచున్నది.

అవ:—పూర్వోక్త భ్రాంతిరూపమగు అధ్యాసక్రమము దిగువ వర్ణింపబడుచున్నది.

దోహా॥ దశా తీన్ అధ్యస్త జగ్ అసత్ రజత్ కీ భాంతి।
అంశ్ సత్య దో శుక్తివత్ అర్థ జ్ఞాన్ భరమాంతి॥6

తా॥ జాగ్రదాద్యవస్థలు మూడును అధిష్ఠానరూపమగు బ్రహ్మయొక్క అజ్ఞానముచే భాసించుచున్నవి. ఈ త్రివిధావస్థలు పరస్పరవ్యభిచరితములగుటచే అసద్రూపములు. ఎట్లన! శుక్తి యందు రజతము, రజ్జువునందు సర్పమున్ను భ్రాంతివలన భాసించుచున్నవి. కాని శుక్తి, రజ్జుజ్ఞానకాలమందు రజత సర్పములు భాసించుటలేదు. ఇదేప్రకారము అధిష్ఠానబ్రహ్మ జ్ఞానముచే దృశ్యమగు ప్రపంచమంతయు అసద్రూపమై బ్రహ్మ స్వరూపముగనే భాసించునని భావము.

మఱియు శుక్తికాదులకు వలెనే బ్రహ్మకును అవిద్యాదృష్టిచే సామాన్యమనియు, విశేషమనియు, కల్పితవిశేషాంశమనియు మూడంశములుగలవు. ఎయ్యది జ్ఞానాజ్ఞానకాలములందు రెంటి యందును ప్రతీతమగునో నయ్యది సామాన్యాంశము. అదియే బ్రహ్మయొక్క 'సత్యస్వరూపము'. శుక్తియొక్క ఇదమంశము. ఎయ్యది జ్ఞానకాలమందే ప్రతీతమగునో అది విశేషాంశము. బ్రహ్మాత్మయొక్క 'అద్వితీయ ముక్త చైతన్యస్వరూపము' బ్రహ్మ యొక్క విశేషాంశమనబడును. అట్లే శుక్తిజ్ఞానమున్ను విశే షాంశమగును. మఱి అజ్ఞానకాలమునందు మాత్రమే ప్రతీత మగునది కల్పిత విశేషాంశమనబడును. ఉదాహరణము — 'చిదాభాసుడు ప్రపంచము' బ్రహ్మభిన్నాత్మయొక్క అజ్ఞాన కాలమున చిదాభాసుడు, ప్రపంచము ప్రతీతమగును. బ్రహ్మ భిన్నాత్మజ్ఞానకాలమందుచిదాభాసుడు, ప్రపంచము ప్రతీతమగుట లేదు. కాన చిదాభాసుడు, ప్రపంచము కల్పితవిశేషాంశము లనబడును. 'ఇదం రజతం' అను స్థలమున రజతము కల్పితవిశే

పాంశమని యెఱుఁగునది. అజ్ఞానకాలమునందు మాత్రమేగదా రజతము భాసించుచున్నది. కనుకనే నయ్యది అసత్యము;మిథ్య. ఈ కల్పిత విశేషాంశమునే అధ్యాసయనియు, భ్రాంతియనియు చెప్పుదురు.

ఈ అధ్యాస అర్థాధ్యాసయనియు, జ్ఞానాధ్యాసయనియు రెండువిధములు. కల్పితమగు జగత్తు అర్థాధ్యాసయనబడును. ఈ కల్పిత జగత్తుయొక్క జ్ఞానము జ్ఞానాధ్యాసయగును. భ్రమ రూపములగు సమస్త భౌతికపదార్థములు పరస్పర వ్యభిచరిత ములు. కనుకనే అసద్రూపములు, మిథ్యయనియు నెఱుంగునది. అవః—అధ్యాస స్వరూపభేదములు, క్రమముగ పంచయుక్తులచే తన్నివృత్తియు యీ దిగువ వర్ణింపబడుచున్నది.

దోహా॥ అర్థరూప్ అధ్యాస్ యహ్
ద్వై సంసర్గ్ స్వరూప్।
యుక్తిప్రమాణహి బాధ్ కర్
అన్యోన్యహిపిఖరూప్ ॥ 7

తా॥ పూర్వోక్తమగు అర్థాధ్యాస స్వరూపాధ్యాసయనియు, సంసర్గాధ్యాసయనియు రెండు విధములు. స్వరూపముతో అధ్యస్తమైనదానిని స్వరూపాధ్యాసయందురు. సంబంధాధ్యాసను సంసర్గాధ్యాస అందురు.

మఱియు యీ అర్థాధ్యాస, కేవల సంబంధాధ్యాస, సంబంధ సహిత సంబన్ధ్యధ్యాస, కేవల ధర్మాధ్యాస, ధర్మసహిత ధర్మ్యధ్యాస, అన్యోన్యాధ్యాస, అన్యతరాధ్యాస అని ఆఱువిధములు. కాని యీ ఆరుభేదములు స్వరూపాధ్యాససంసర్గాధ్యాసల రెంటి లోనే అంతర్గతములని యెఱుఁగునది. వీటికన్నిటికిని లక్షణో

దాహరణములు విచారసాగరాది బృహద్గ్రంథములలో చూచు దరుగాక.

ఈ ఆరింటిలో అన్యోన్యాధ్యాస ముఖ్యముగ ఆత్మవిచార మునకు విశేషోపయుక్తమగును. ఆత్మానాత్మల పరస్పరా ధ్యాసము అన్యోన్యాధ్యాసమనబడును.

సత్తు, చిత్తు, ఆనందము, అద్వైతము ఇవి నాలుగు ఆత్మ విశేషణములు. మఱియు అసత్తు, జడము, దుఃఖము, ద్వైతము, ఈ నాలుగు అనాత్మవిశేషణములు. ఇందు ఆత్మగతములైన సత్తు, చిత్తు, యీ రెండు విశేషణములచే అనాత్మగతములైన అసత్తు, జడము, యీ రెండు విశేషణములు ఆవరింపబడినవి. కనుకనే అనాత్మలైన అహంకారాదులందు, అసజ్జడరూపములని ప్రతీతిగలుగుటలేదు. మఱేమన — సద్రూపములనియు, చిద్రూ పములనియు ప్రతీతిగలుగుచున్నది. ఇట్లే అనాత్మగతములైన దుఃఖము, ద్వైతము, యీ రెండు విశేషణములును ఆత్మగత విశేషణములైన ఆనందాద్వైతములరెండింటిని మరుగుపరచినవి. కనుకనే ఆత్మయందు 'నేను ఆనందరూపుడను, అద్వైతరూపు డను,' అనునట్టి ప్రతీతి గలుగుటలేదు. మఱి దీనికి విపరీతముగ 'నేను దుఃఖిని, యీశ్వరునికంటె భిన్నుడను' అని ప్రతీతి గలుగు చున్నది. ఈ విధముగ ఆత్మానాత్మల పరస్పరాధ్యాసమునే అన్యోన్యాధ్యాసమందురు.

అధ్యాస అన్నను, భ్రాంతి అన్నను ఒక్కటియే. ఈ అధ్యాస రూపభ్రాంతియు, (1) భేదభ్రాంతి, (2) కర్తృత్వ భోక్తృత్వ భ్రాంతి, (3) సంగభ్రాంతి, (4) వికారభ్రాంతి, (5) బ్రహ్మ భిన్న జగత్సత్యత్వభ్రాంతి అని అయిదు విధములు. ఇందు మొదటిదగు భేదభ్రాంతియు (1) జీవేశ్వరభేదము, (2) జీవజీవ

పరస్పరభేదము (3) జీవజడభేదము, (4) జడజడ పరస్పరభేదము, (5) ఈశ్వరజడభేదమని అయిదు విధములు.

పూర్వోక్తములగు పంచభ్రమలు యీ చెప్పబోవు అయిదు దృష్టాంతములచే నివృత్తములగును.

(1) మొదటిదగు భేదభ్రాంతి బింబప్రతిబింబభావ దృష్టాంతముచే నివృత్తమగును. ఎట్లనః—దర్పణమునందు ముఖము ప్రతిబింబించునపుడు వస్తుతః ఆ ప్రతిబింబము దర్పణమునందులేదు. మఱేమన, దర్పణమును విషయీకరించుటకై అనగా గ్రహించుటకై లేక దర్శించుటకై బయలువెడలిన నేత్రేంద్రియవృత్తి లేక చక్షుఃకిరణములు దర్పణమును స్పృశించి, వెనుకకుమఱలినవై ముఖమును దర్శించుచున్నవి. ఈ రీతిగా బింబమగుముఖముతో ప్రతిబింబము అభిన్నమగుటచే ప్రతిబింబము సత్యము. కాని ప్రతిబింబధర్మములైన బింబమునకంటె భిన్నత్వము, విపరీతత్వము, దర్పణస్థితి యీ మూడు ధర్మములు, తత్ప్రతీతియు భ్రాంతియగును. అట్లే శుద్ధబ్రహ్మరూపబింబముయొక్క జీవరూప ప్రతిబింబము అజ్ఞానరూపదర్పణమునందు ప్రతిబింబించుచున్నది. ఆ ప్రతిబింబము బ్రహ్మరూపబింబముతో సర్వదా అభిన్నమైనది. కాని బ్రహ్మముతో భేదము జీవత్వము మొదలగు ధర్మములును, తద్జ్ఞానమున్ను భ్రాంతియగును. ఈ బింబప్రతిబింబ భావ దృష్టాంతముచే భేదభ్రాంతి నివృత్తమగును.

(2) స్ఫటిక జపాకుసుమ దృష్టాంతముచే కర్తృత్వ భోక్తృత్వ భ్రాంతి నివృత్తమగును.

స్ఫటికమణియందు జపాకుసుమ సంయోగముచే కుసుమగత రక్తవర్ణము భాసించును. జపాకుసుమవియోగమగుచో ఆ రక్త

వర్ణము భాసించదు. కాన ఆ రక్తవర్ణము స్ఫటికమణి ధర్మము గాదు. స్ఫటికధర్మమనుట భ్రాంతి. అట్లే అంతఃకరణధర్మములైన కర్తృత్వ భోక్తృత్వములు ఆత్మయందు తాదాత్మ్యసంబంధముచే భాసించును. సుషుప్తికాలమున అంతఃకరణము ఆత్మతో వియుక్తమైనపుడు ఆధర్మములు ఆత్మయందు భాసించుటలేదు. కాన కర్తృత్వాదులు ఆత్మధర్మములుకావు. ఆత్మధర్మములనుట భ్రాంతి. ఈ భ్రాంతి స్ఫటికజపాకుసుమ దృష్టాంతముచే నివృత్తమగును.

(3) ఘటాకాశదృష్టాంతముచే సంగభ్రాంతినివృత్తమగును. ఘటోపహితాకాశము ఘటాకాశమనబడును. ఆ యాకాశము ఘటముతోడ భాసించినను, ఘటధర్మములయిన ఉత్పత్తి వినాశాదులు ఆ యాకాశమునంటవు. కాన ఆ ఆకాశము అసంగము. ఆ ఆకాశమునకు ఘటముతో సంబంధమున్నదనుట భ్రాంతియగును. అట్లే దేహాది సంఘాతోపహితాత్మ జీవుడనబడును. ఆ యాత్మ సంఘాతముతో భాసించినను, సంఘాతధర్మములైన జననమరణాదులు ఆత్మను స్పృశింపవు. ఆత్మ అసంగము. 'అసంగోఽహ్యాయం పురుషః' అని శ్రుతి. జననమరణాదులు ఆత్మధర్మములనుట భ్రాంతి. ఈ సంగభ్రాంతి ఘటాకాశ దృష్టాంతముచే నివృత్తమగునని యెరుంగవలయును.

(4) రజ్జు సర్పదృష్టాంతముచే వికారభ్రాంతి నివృత్తమగును. మందాంధకారమునందున్న రజ్జువును చూచుటకై నేత్రద్వారమున రజ్జువువఱకు వచ్చిన అంతఃకరణవృత్తిచే రజ్జువుయొక్క ఆవరణభంగము సంపూర్ణముగ కాదు. అపుడు రజ్జుచైతన్యాశ్రితమగు అవిద్య క్షోభితమై సర్పరూప వికారమును పొందును. వికారమైన ఆ సర్పము భ్రాంతి సిద్ధము. కనుకనే

మిథ్య. అట్లే బ్రహ్మచైతన్యాశ్రితమగు అవిద్య, ప్రారబ్ధనిమిత్తముచే క్షోభమునుపొంది ప్రపంచరూప వికారమును పొందును. ఈ ప్రపంచము అధిష్ఠానచైతన్యవివర్తము*. కాన మిథ్యయని గ్రహించునది.

(5) స్వర్ణకుండల దృష్టాంతముచే బ్రహ్మభిన్న జగత్సత్యత్వ భ్రాంతి నివృత్తమగును.

కనకము, కుండలము యివి ఒకటేయైనను కారణమనియు, కార్యమనియు భేదప్రతీతి యగుచున్నది. విచారించిచూచిన కుండలము కనకముకంటె భిన్నముగ కనబడదు. అట్లే జగత్తునకు బ్రహ్మముతో కార్యకారణభావముచే భేదము భాసించును. ఆ భేదము కల్పితమేగాని వాస్తవముగాదు. ఈ కనకకుండల దృష్టాంతముచే బ్రహ్మభిన్నజగత్సత్యత్వభ్రాంతి నివృత్తమగును.

అవ:—ఇక ఏ విచారణచే ముముక్షువులు యథార్థజ్ఞానమును పొందగలుగుదురో అట్టి బ్రహ్మాత్మయొక్క యథార్థ విశేషణములు నిరూపింపబడుచున్నవి.

దోహా॥ విధి నిషేధ్ విశేషణ హి విధీరూప్ సాక్షాత్ ।
జగ్ నిషేధ్ కర్ దూజ్ కహి బ్రహ్మానామ బీసాత్॥8

తా॥ బ్రహ్మస్వరూపమగు ఆత్మయొక్క విశేషణములు విధి రూపములనియు, నిషేధరూపములనియు రెండువిధములు.

---

* అధిష్ఠానమునకంటె విషమసత్తగలదై అన్యథారూపమైనదానిని వివర్తమందురు. ప్రపంచమునకు అధిష్ఠానమైన బ్రహ్మము పారమార్థికసత్తతో గూడినది. తత్కార్యభూతమైన ప్రపంచము వ్యావహారికసత్తతో గూడినది. కాన వివర్తమనబడును. కనుక నే మిథ్య ఉపాదానముతో సమానసత్తగలిగిన అన్యథారూప పరిణామమనబడును. క్షీరపరిణామము దధియని చెప్పంగవలయును. క్షీర దధులు రెండును వ్యావహారిక సత్తతో గూడినవి.

విధిముఖేన సాక్షాద్బ్రహ్మప్రతిపాదక విశేషణములు 'విధి విశేషణము'లనబడును. అనగా 'సత్యము, చైతన్యము, ఆనందము, బ్రహ్మ, స్వయంప్రకాశము, కూటస్థము, సాక్షి, ద్రష్ట, ఉపద్రష్ట, ఏకము' అను నీపదియు విధివిశేషణము లనబడును.

జగత్తును నిషేధించి తద్ద్వారా అర్థాత్ బ్రహ్మను ప్రతిపాదించు విశేషణములు 'నిషేధ విశేషణము'లనబడును. అనగా — 'అనంతము, అఖండము, అసంగము, అద్వైతము, అజన్మము, నిర్వికారము, నిరాకారము, అవ్యక్తము మొదలగునవి నిషేధ విశేషణములనబడును.

అంతవత్తగు (వినాశశీలమగు) జగత్తునకంటె విలక్షణమైన బ్రహ్మము దేశకాలవస్తువులచే అంతము (వినాశము) లేనిది. కాన బ్రహ్మ అనంతము. ఇట్లే తక్కిన విశేషణములును నిషేధముఖేన బ్రహ్మమును ప్రతిపాదించుచున్నవని యెరుంగ వలయును.

విధివిశేషణములుగాని, నిషేధవిశేషణములుగాని రెండును లక్షణావృత్తిచే బ్రహ్మమును ప్రతిపాదించుచున్నవేగాని అభిధా వృత్తిచే కాదు.

కనుకనే యీ విశేషణములలో భేదమున్నను లక్ష్యస్వరూప మగు బ్రహ్మాత్మయందు భేదమెన్నటికిని లేదు. కాని యీ విశేషణములు బ్రహ్మాత్మస్వరూపములే యగును. శైత్యము (చల్లదనము), శ్వేతత్వము (తెలుపుదనము), గురుత్వము (బరువు) యీ మూడుగుణములు మంచుగడ్డయొక్క స్వరూపము లెట్లో, అట్లే సత్యాది విశేషణములును బ్రహ్మాత్మ స్వరూపములేగాని తద్వ్యతిరిక్తములుగావు.

అవ:— ఇక బ్రహ్మాత్మయొక్క సత్యజ్ఞానానందస్వరూపము, దృశ్యజగత్తుయొక్క అసజ్జడ దుఃఖరూపము నిరూపింప బడుచున్నది.

దోహా॥ సత్ చేతన ఆనందమయ్ దశాకాల భరపూర్ ।
దుఃఖ్ అసజ్జడ్ దృశ్య్ సబ్ ఆతమ్ ఇన్ సే దూర్ ॥9

తా॥ బ్రహ్మస్వరూపమగు ఆత్మ సత్యజ్ఞానానంద స్వరూపమైనది. అట్టి బ్రహ్మాత్మ జాగ్రదాది త్రివిధావస్థలయందును, భూతాది త్రివిధకాలములందును, ఏకరసమై ప్రకాశించుచున్నది. జగత్తునందలి సమస్తపదార్థములు ఆ బ్రహ్మాత్మకొఱకే ప్రియములగుచున్నవి. కాన పూర్ణ పరమానందస్వరూపమగు ఆ బ్రహ్మాత్మయే పరమప్రియమైనది.

"న వా అరే పత్యుః కామాయ పతిః ప్రియో భవతి, ఆత్మనస్తు కామాయ పతిః ప్రియో భవతి"

"న వా అరే సర్వస్య కామాయ సర్వం ప్రియం భవతి, ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి" ఇత్యాది శ్రుతి వాక్యములు పుత్రమిత్ర కళత్రాదులకంటె ఆత్మయే పరమ ప్రియమైనదని తెలుపుచున్నవి.

ఈ సమస్తజగత్తు అసద్రూపము, జడము, సమస్త దుఃఖములకును ఆకరము. కాన అసజ్జడ దుఃఖరూపమగు యీ ప్రపంచమందలి సత్యత్వబుద్ధిని పరిత్యజించి, దేహాదుల కతీతమై సచ్చిదానంద స్వరూపమగు బ్రహ్మాత్మను లక్షణావృత్తిద్వారా నిశ్చయింపవలయును.

అవ:— అవాఙ్మానసగోచరమగు బ్రహ్మను తెలుసుకొనుటెటుల? అను ప్రశ్నకు సమాధాన మీదిగువ నిరూపింప బడు చున్నది.

దోహా॥ బ్రహ్మ అగోచర్ వాక్ మన్
సంత్ వేదలఖు భేద్ ।
వృత్తి వ్యాప్తి సంతలఖు
కహేఁ లక్షణావేద్॥ 10

తా॥ గుణ, క్రియా, జాతి, సంబంధములు నాలుగును మనో వాక్కులకు విషయములగును (గోచరములగునని భావము). ఈ నాలిగింటికిని అతీతమై, అనగా నిర్గుణమై, నిష్క్రియమై, జాతి సంబంధ వర్జితమైన బ్రహ్మము మలినములగు మనో వాక్కులకు గోచరముకాదు.

శంక:— మనస్సు బ్రహ్మను తెలుసుకొనజాలనిచో, వాక్కు బ్రహ్మను ప్రతిపాదింపజాలనిచో యిక ఆత్మజ్ఞాని బ్రహ్మను యెటుల తెలుసుకొనును? మఱియు ఆ బ్రహ్మాత్మను యెటుల ప్రతిపాదింపగలుగును?

సమాధానము:— నిజమే. వినుడు. వేదాన్త శాస్త్రమున సమస్తవస్తు ప్రత్యక్షమునకై ద్వివిధ ప్రక్రియ లంగీకరింపబడినవి. అందు ఒకటి 'వృత్తివ్యాప్తి'. రెండవది 'ఫలవ్యాప్తి'. ఇవి శాస్త్రీయ విషయములగుటచే నామమాత్ర కథనముచే అందరి కిని సుబోధములు గావు. కాన విస్తారమైనను కొంతవరకు విశద పరుప యత్నించెద.

వేదాన్తశాస్త్రమున — ప్రమాతృచైతన్యము, ప్రమాణ చైతన్యము, విషయచైతన్యము అని చైతన్యము మూడు విధము లంగీకరింపబడినది. అంతఃకరణావచ్ఛిన్న చైతన్యము ప్రమాతృచైతన్య మనబడును. అంతఃకరణ వృత్త్యవచ్ఛిన్న చైతన్యము ప్రమాణచైతన్య మనబడును, ఘటపటాద్యవచ్ఛిన్న

చైతన్యము విషయచైతన్యమనబడును. అంతఃకరణము తైజస పదార్థముగ నంగీకరింపబడినది.

తటాకములోని జలము చిన్నచిన్న కాలువలద్వారా ప్రవహించి, క్షేత్రములలో (పొలములలో) ప్రవేశించి, తదాకారముగ నెటుల పరిణమించుచున్నదో, అనగా క్షేత్రము (పొలము) ముక్కోణాకారమగుచో జలమున్ను ముక్కోణాకారముగను, పొలము చతుష్కోణాకారమగుచో జలమున్ను చతుష్కోణాకారముగ క్షేత్రాకారము ననుసరించి జలమెటుల పరిణమించునో అటులనే తైజసమగు అంతఃకరణము నేత్రేంద్రియముద్వారా బయల్వెడలి ఘటాది విషయములున్నచోటికి వెళ్లి ఘటాది విషయాకారముగ పరిణమించుచున్నది. ఇంద్రియ సన్నికర్షచే ఘటాకారాంతఃకరణవృత్తి కలుగగా, అందు అంతఃకరణావచ్ఛిన్న చైతన్యము ప్రతిబింబించును. ఆ ప్రతిబింబితచైతన్యమే 'ఫల' మనబడును. చైతన్య ప్రతిబింబముతోగూడిన అంతఃకరణవృత్తి ఘటాదివిషయముల వ్యాపించుచున్నది. వృత్తితోబాటు తత్ప్రతిబింబిత చైతన్యముగూడ వ్యాపించుచున్నది. కాన ఫలచైతన్యమునకు వ్యాప్తి సంభవించినది. అంతఃకరణవృత్తి ఘటాదివిషయావరణాజ్ఞానమును భంగపరచును. ఆవరణము భగ్నమైనను — వృత్తి, ఘటము రెండు జడములగుటచే ఘట ప్రత్యక్షము కానేరదు. కనుకనే వృత్తియందు అంతఃకరణావచ్ఛిన్న చైతన్యము (చిదాభాసుని) యొక్క ప్రతిబింబ మంగీకరింపబడినది. ఆ ప్రతిబింబిత చైతన్యముచే ఘటము ప్రకాశించును. అంతఃకరణవృత్త్యవచ్ఛిన్న చైతన్యము (ప్రమాణ చైతన్యము), విషయావచ్ఛిన్న చైతన్యము రెండు అభిన్నములగుటచే 'అయం ఘటః' అనుచోట 'యిది ఘటము' అని

ఘటవిషయక ప్రత్యక్షమగును. ఇట్లే అంతఃకరణావచ్ఛిన్న చైతన్యము, వృత్త్యవచ్ఛిన్న చైతన్యము అభిన్నములగుటచే జ్ఞానప్రత్యక్షమున్ను అగును. అంతఃకరణవృత్తితోపాటు ఫల రూప చైతన్యమున్ను విషయమును వ్యాపించుటచే ఘటపటాది జడపదార్థ ప్రత్యక్షములందు ఫలవ్యాప్తి అంగీకరింపబడినది.

మఱి — 'తత్త్వమసి' మొదలగు మహావాక్యశ్రవణానంత రము బ్రహ్మాకారాంతఃకరణవృత్తి జనించి బ్రహ్మవిషయక అజ్ఞానావరణమును భంగపరచును. వృత్తికార్యము అంతవరకే. ఆవరణనాశము కొఱకే శాస్త్రకారులు 'వృత్తి' నంగీకరించిరి. ఆవరణము తొలగగ లక్ష్యభూతమగు చైతన్యము స్వయం ప్రకాశమై వెలుగుచుండ, అదియు, వృత్త్యవచ్ఛిన్న చైతన్య మున్ను అభేదమును పొందును. దీనినే బ్రహ్మసాక్షాత్కార మందురు. ఇచట ఘటపటాది ప్రత్యక్షములందువలె ప్రతిబింబిత ఫల చైతన్యముతో అవసరము లేదు. కనుకనే యిట్టి చోటులందు 'వృత్తివ్యాప్తి' నంగీకరించిరి. ఇచట 'ఫలవ్యాప్తి'తో బనిలేదు.

శ్లో॥ బుద్ధితత్స్థ చిదాభాసౌ ద్వావపి వ్యాప్నుతో ఘటం।
తత్రాజ్ఞానం ధియా నశ్యేదాభాసేన ఘటః స్ఫురేత్॥
(పంచదశి — తృప్తిదీపప్రకరణము.)

తా॥ అంతఃకరణవృత్తి, తత్ప్రతిబింబిత చైతన్యము యీ రెండును ఘటమును వ్యాపించును. ఘటాకార అంతఃకరణ వృత్తిచే ఘటవిషయకాజ్ఞానము తొలగును. పిదప చిదాభాసునిచే (అంతఃకరణావచ్ఛిన్న చైతన్యముచే) ఘటము స్ఫురించును. ఘటప్రత్యక్షమగునని భావము. ఇది ఘటపటాది జడపదార్థ విషయక ప్రత్యక్షమునుగూర్చి చెప్పబడినది. ఇదియే ఫలవ్యాప్తి.

శ్లో॥ 'బ్రహ్మణ్యజ్ఞాననాశాయ వృత్తివ్యాప్తిరపేక్షితా'

'తత్త్వమస్యా'ది వాక్యములచే బ్రహ్మవిషయక అజ్ఞానము తొలగుటకై 'వృత్తివ్యాప్తి'మాత్రము అపేక్షింపబడినది. బ్రహ్మాకారవృత్తిచే అజ్ఞానముతొలగగ బ్రహ్మ స్వయంజ్యోతి స్స్వరూపముతో స్వయముగనే ప్రకాశించునని భావము. కాన మూలప్రశ్నకు సమాధానమేమన — బ్రహ్మ అవాఙ్మానస గోచరమైనను, నిష్కామకర్మాచరణముచే అంతఃకరణము పరిశుద్ధముకాగా, శుద్ధసత్త్వోపేతమగు స్వచ్ఛాంతఃకరణమున బ్రహ్మాకారవృత్తి జనించును. తద్ద్వారా అజ్ఞానము తొలగి బ్రహ్మసాక్షాత్కారమగును. మలినాంతఃకరణముచే పొంద శక్యము గాదు. కాబట్టి 'అవాఙ్మానసగోచరము బ్రహ్మ' అని శాస్త్రములు చెప్పుచున్నవి. కాన ముముక్షువులు చిత్తశుద్ధిద్వారా బ్రహ్మసాక్షాత్కారము పొందుటకై అనవరతము ప్రయత్నింపవలయును.

వేదాన్తశాస్త్రమున ప్రతిపాదింపబడిన సత్యాది విధి విశేషణములన్నియు లక్షణావృత్తిద్వారా బ్రహ్మాత్మను బోధించుచున్నది. అనగా సత్యాది విశేషణములు సాపేక్షకసత్యత్వముగల మాయాదుల పరిత్యజించి నిరపేక్షక సత్యస్వరూపమగు బ్రహ్మాత్మను ప్రతిపాదించుచున్నవి. ఇట్లే అనంతాది నిషేధవిశేషణములున్న ప్రపంచాదులను సాక్షాత్తుగ నిషేధించి — అర్థాత్ బ్రహ్మాభివ్యంజకములగుచున్నవి.

అవ:— లక్షణాస్వరూపము నిరూపింపబడుచున్నది.

దోహా॥ తత్త్వంపదకే వాచ్య్ పిఖ్
తత్ పద్ ఈశ్ హిజాన్ ।

అవిది ఉపాధీ జీవత్వం
లఖి చేతన పహిచాన్ ॥ 11

తా॥ శబ్దమునకు అర్థముతోటి సంబంధమును శబ్దవృత్తి అందురు. అది 'శక్తివృత్తి', 'లక్షణావృత్తి' అని రెండువిధములు. స్వార్థసామర్థ్యముగల శబ్దమునకు అర్థముతో సాక్షాత్సంబంధము 'శక్తివృత్తి' యనబడును. శక్యార్థముద్వారా శబ్దమునకు అర్థముతో పరంపరా సంబంధము 'లక్షణావృత్తి' అనబడును. శక్తివృత్తిచే నెరింగిన అర్థము శక్యార్థమనియు, (వాచ్యార్థము) లక్షణావృత్తిచే నెరింగిన అర్థము 'లక్ష్యార్థ'మనియు జెప్పబడును.

ఈ లక్షణావృత్తి — (1) జహల్లక్షణ, (2) అజహల్లక్షణ, (3) జహదజహల్లక్షణ అని మూడువిధములు. చివరిదానిని 'భాగత్యాగలక్షణ' అనికూడ అందురు. మహావాక్యములందు యీ చివరి భాగత్యాగలక్షణమే ఉపయోగించును.

'తత్త్వమసి' అను యీ మహావాక్యమునకు వాచ్యార్థము 'ఆయీశ్వరుడవు నీవే' అని. అనగా సర్వజ్ఞమై సర్వశక్తివంతమైన మాయోపహిత ఈశ్వరచైతన్యము తత్పదమునకు వాచ్యార్థము. మఱి 'త్వం' పదమునకో — అల్పజ్ఞమై, అల్పశక్తిమత్తైన అవిద్యావిశిష్టచైతన్యము వాచ్యార్థము. ఈవాచ్యార్థములందలి విరోధాంశముల రెంటిని పరిత్యజించినమాత్రమే 'తత్త్వం' పదముల రెంటికిని అభేదము సిద్ధించును. అనగా ఈశ్వరుని సర్వజ్ఞత్వాది ధర్మములను, జీవుని అల్పజ్ఞత్వాది ధర్మములను, మఱియు మాయాఽవిద్యాది విరోధిభూతములగు ఉపాధులను మిథ్యయని యెరింగి, ఈశ్వరజీవులందు అనుస్యూతమైన సత్యస్వరూపమగు సామాన్యచైతన్యము ఏకము, అద్వైతము అని గ్రహింపవలయును. ఇదియే లక్ష్యార్థమనబడును.

పైన జెప్పబడిన 'తత్త్వం' పదముల ఏకత్వగ్రహణముచే 'ఏది బ్రహ్మమో అది నేను. ఏది నేనో అది బ్రహ్మము' అనునట్టి దృఢనిశ్చయము గలిగియుండవలయును. ఈ నిశ్చయమునకే తత్త్వజ్ఞానమనిపేరు. ఈ తత్త్వజ్ఞానముచేతనే మోక్షముగలుగును.

అవః— బ్రహ్మ చైతన్యభేదము నిరూపింపబడుచున్నది.

దోహా॥ బ్రహ్మసమాన విశేషవిధి
కల్పిత్ జగత్ విశేష్ ।
భాతి సమాన హి అస్తి ప్రియ్
అద్వైముక్తి అశేష్ ॥ 12

తా॥ వేదాన్తశాస్త్రమందు బ్రహ్మచైతన్యము సామాన్యమనియు, విశేషమనియు రెండువిధముల వివక్షితమైనది. అధిక దేశకాలములందు ప్రతీతమగు చైతన్యము సామాన్యమనియు, అల్పదేశకాలములందు ప్రతీతమగు చైతన్యము విశేషమనియు చెప్పబడును.

జడమగు భూతద్దమున ప్రతిబింబించిన సూర్యకిరణములందు దహించునట్టి, ప్రకాశింపజేయునట్టి సామర్థ్య మెట్లులగలదో, అట్లే అంతఃకరణమునందు ప్రతిబింబించిన చిదాభాసునియందును జ్ఞానాదిశక్తులున్నవి. అంతఃకరణ ప్రదేశమునందు భ్రాంతిరూపమైన స్వల్పకాలమున భాసించుటచే చిదాభాసుని 'కల్పితవిశేష చైతన్య' మందురు. ఈ చిదాభాసుడే సమస్తకర్మల చేయుచున్నవాడై, సుఖదుఃఖాది ఫలముల ననుభవించుచు కర్త, భోక్తయని పిలువబడును.

సూర్యప్రకాశమెట్లుల సర్వత్రవ్యాపకమై ప్రకాశించుచున్నదో అట్లే అస్తి, భాతి, ప్రియరూపమగు సామాన్య చైతన్యము

సమస్తదేశకాలములందు అనుస్యూతమైయున్నది. ఈ నామ రూపాత్మక జగత్తు కల్పితమైనది.

అవ:— పూర్వోక్తప్రకారము బ్రహ్మాత్మ శుద్ధము, అద్వైతము అని నిశ్చయించుటకు మఱికొన్ని యుక్తులు నిరూపింప బడుచున్నవి.

దోహా॥ బ్రహ్మవస్తు జ్ఞేయ్ జాన ఇవ్
జగ్ అనర్థ్ సబ్ బాద్ ।
బ్రహ్మ సచ్చిదానంద్ లఖి
ముక్తి పరమకో సాధ్ ॥ 13

తా॥ అద్వైత జ్ఞానవిషయమగు జ్ఞేయపదార్థమును క్రింది యుక్తులద్వారా నిశ్చయింపవలయును.

అజ్ఞానజన్యమైన కల్పిత అనాదిత్వాది సమస్త ధర్మ విశిష్టమైన జగత్తు ప్రత్యక్షముగ గోచరించుచున్నను స్వప్నసృష్టివలె అత్యన్త అసత్తు, సకలానర్థములకు మూలమని తెలుసుకొనవలయును.

అద్వైత బ్రహ్మాత్మ సచ్చిదానంద స్వరూపమైనది. అనగా జాగ్రదాది త్రివిధావస్థలందును 'నేను ఉన్నాను' అను ప్రతీతి గలుగుచున్నది. కాని 'నేను లేను' అను ప్రతీతి యెవనికిని యెప్పుడును గలుగుటలేదు. ఈ కారణముచే సర్వత్ర స్వాత్మజ్ఞానమే గలుగుచున్నది. ఈ ప్రకారము దేశదేశాన్తరగాములగు అంతర్బాహ్యవృత్తులను అన్నిటిని దెలుసుకొనునది నిత్యజ్ఞానస్వరూపమగు యీ చిదాత్మయే. మఱియు పూర్వోక్త సమస్తవృత్తుల అభావమునుగూడ 'నేనే' ఏకరసముగ ప్రకాశింపజేయుచున్నాను. అనగా నిత్యజ్ఞాన స్వరూపమగు ఆత్మకు యేలాటి దేశకాలము

లందును అభావముండదని భావము. ఈ విధముగ ఆత్మ నిత్యజ్ఞాన స్వరూపమని నిశ్చయింపవలయును.

మఱియు సమస్తజీవులు తమ తమ సుఖముకొఱకై నిరంతరము సర్వవిధముల ప్రయత్నించుచున్నారు. తమ సుఖమునకు, ఆనందమునకు విరోధులైన ప్రియమిత్రులను, బంధువులను, పుత్ర కళత్రాదుల సైతము పరిత్యజించి తమ ఆనందమునకయ్యే పాటుబడి సంతోషించుచున్నారు. కాన పరమప్రేమాస్పదమై సచ్చిదానంద స్వరూపమగు బ్రహ్మాత్మయొక్క దృఢభావన చేయవలయును. అదియే ముక్తికి కారణము.

అవః— అట్టి దృఢభావనకు సాధనభూతములైన సప్తజ్ఞానభూమికలు నిరూపింపబడుచున్నవి.

దోహా॥ సాత్ భూమికా జ్ఞానహిత్ శుభ్ ఇచ్ఛా సువిచార్ ।
తను సత్త్వాపత్తి సక్తిఁతజ్ సబ్ అభావ్ చిదసార్ ॥ 14

తా॥ బ్రహ్మజ్ఞాన సాధనభూతములగు చిత్తావస్థలు విశేషరూపముగ సప్తభూమికలనబడును. అనగా అద్వైతజ్ఞానదార్ఢ్యము కొఱకు సప్తభూమికలు విధింపబడినవి. వైరాగ్య శీలుడగు సద్గురువుయొక్క అనుగ్రహముచే లభించిన శ్రవణ, మనన, నిదిధ్యాసనాదుల అవాంతర భేదములే యీ సమస్తభూమికలు. ఈ యేడింటియొక్క పేర్లు, వాటి అర్థము క్రమముగ క్రింద నిరూపింపబడుచున్నది.

1. పూర్వజన్మమున లేక యీ జన్మమున చేయబడిన నిష్కామ కర్మాచరణముచే పరిశుద్ధమైన మనస్సుగల సాధకునికి అత్యంతిక శ్రేయోరూపమగు మోక్షమునుగూర్చి తీవ్రేచ్ఛ గలుగుట 'శుభేచ్ఛ' యగును.

2. గురుముఖమున వేదాన్తవాక్య శ్రవణముజేసి, నానావిధ యుక్తులతో జీవబ్రహ్మైక్య విచారముచేయుట 'సువిచార' మనబడును.

3. జీవబ్రహ్మాభేదార్థగోచరమై, సజాతీయవృత్తి ప్రవాహ రూపమైన మనస్సుయొక్క సూక్ష్మావస్థ 'తనుమానస' యన బడును.

4. శ్రవణమనన నిదిధ్యాసనములచే బ్రహ్మాత్మాకారమైన సత్త్వభావప్రాప్తి (జ్ఞానప్రాప్తి) యే 'సత్త్వాపత్తి' యగును.

5. తన దేహమునందలి అహంత్వమును, బంధుమిత్రాదు లందలి మమత్వమును పరిత్యజించుటయే 'అసంసక్తి' యన బడును.

6. నిరంతరము బ్రహ్మాకార వృత్తియందు రమించుటచే సమస్త అనాత్మపదార్థములు అత్యంత అభావరూపములని దృఢ భావన గలిగియుండుట 'పదార్థాభావని' యగును.

7. జ్ఞాతృజ్ఞాన జ్ఞేయరూప త్రిపుటి భాసింపని బ్రహ్మాత్మ స్వరూపమైన తురీయపదమున (అధిష్ఠానమునందు) మనస్సు యొక్క ఉత్థానరహితస్థితి 'తురీయగ' అనబడును.

ఈ యేడు భూమికలయొక్క నిరంతరాభ్యాసముచే అద్వైత జ్ఞానము దృఢమై జీవన్ముక్తావస్థ గలుగును.

అవ:— జీవన్ముక్తి స్వరూపము నిరూపింపబడుచున్నది.

దోహా॥ జీవన్ముక్తి జ్ఞానదృఢ్ భేద్ భరమ సబ్ హాని।
లేశ్ అవిద్యా కర్మ సబ్ విలయ్ విదేహీ జానీ॥15

తా॥ తమ తమ ప్రారబ్ధకర్మానుసారము జీవితమునకు కారణ భూతములైన అవసరమగు వ్యవహారమునుమాత్ర మాచ రించుచు, ఆత్మ నిత్యముక్త స్వరూపమను నిశ్చయము గలిగి యుండుట 'జీవన్ముక్తి' యగును. అనగా దేహాది ప్రపంచము ప్రతీతమగుచున్నను ఆత్మప్రబోధము గలిగి, నిరంతరము బ్రహ్మ స్వరూపమునందు నిలకడ గలిగియుండుట 'జీవన్ముక్తి' యన బడును.

దృఢమగు ఆ బ్రహ్మజ్ఞానముచే భేదభ్రాంతియొక్కయు, కర్తృత్వ, భోక్తృత్వ, పరిచ్ఛిన్నత్వాది విపర్యయరూపమగు మూలాజ్ఞానముయొక్కయు అభావము నిశ్చయమగును.

ఈ శరీరారంభకములైన విక్షేపరూప ప్రారబ్ధకర్మ మాత్రము అనుభవానంతరము నశించును. ప్రారబ్ధభోగ క్షయానంతరము విదేహముక్తి గలుగును. అనగా ఆవరణరూప మూలాజ్ఞానము నశింపగా, దాని నాశ్రయించుకొనియున్న అనంతజన్మల సమస్త సంచితకర్మలు నశించును. మఱియు పూర్వోక్త విపర్యయా భావము నిశ్చయము కాగా ఆగామికర్మలు, అనగా జ్ఞానోదయము నకు పూర్వమీజన్మలో చేసినకర్మలు నశించును. జ్ఞానోదయా నంతరము ఆత్మజ్ఞాని ఆచరించు కర్మలెల్ల కర్మాభాసలేగాని కర్మలుగావు. భర్జితబీజములవలె జన్మాంతర హేతువులు కాజా లవు. జ్ఞానోదయమైనపిదప ఆచరించు కర్మలు ఆత్మజ్ఞానిని అంట జాలవు.

'కుర్వన్నపి న లిప్యతే' (గీత) తాను చేయుచున్నను చేయని వాడే. కర్తృత్వాదులు నశించుటచే కర్మలు స్పృశింపవనిభావము.

భావిజన్మకు కారణభూతమైనమూలాజ్ఞానము, ప్రారబ్ధాగామి కర్మలు నశింపగా, దేహపాతానంతరము ఆత్మజ్ఞాని కైవల్య రూపమగు విదేహముక్తిని పొందును.

అవ:— జీవన్ముక్తికి కారణమగు విచారజ్ఞానము క్రింద నిరూపింప బడుచున్నది.

దోహా॥ అహం బ్రహ్మ కే జ్ఞాన్ సే ఏక్ భావనా హోయి।
జీవ్ జగత్ అరు కలా సబ్ జానోం అద్వై సోయి॥

తా॥ 'అహం బ్రహ్మాస్మి' 'నేను బ్రహ్మను' అను యథార్థ జ్ఞానముచే బ్రహ్మైకత్వభావన దృఢమగును. బ్రహ్మాత్మయొక్క యీ యథార్థబోధచే జీవుడు, జగత్తు, షోడశకళలు, ఇవన్నియు బాధజెందును. అనగా అత్యంతాభావమును పొందును. అద్వయ మగు ఆ బ్రహ్మాత్మ ఒక్కటే నిత్యమనియు, పరమార్థతత్త్వ మనియు యెరుఁగుము.

దోహా॥ నిశ్చయ్ హోయి అఖండతా
మైఁ హూఁ బ్రహ్మ అనూప్।
ఇదం అహం త్వం ఝూఠ్ సబ్
అస్తి భాతి ప్రియరూప్॥ 17

తా॥ అఖండవాక్యార్థముచే లక్షితమగు 'అపరిచ్ఛిన్న పూర్ణ పరబ్రహ్మమును నేను' అను నిశ్చయముచే, నీవు, నేను, నాది, ఇది అను భేదములెల్ల తొలగును. పిదప అస్తి భాతి ప్రియరూప ములకు ఉపాధియైన నామరూపాత్మక జగత్తునందలి పంచవిధ భేదములను నేను బ్రహ్మస్వరూపముగ దెలునుకొనుచున్నాను.

దోహా॥ నహీ చాహూఀ నహీ త్యాగ్ మమ
మైఀ హూఀ బ్రహ్మస్వరూప్।
సప్తధాతుమయ దేహ్ భీ
నిశ్చయ్ సత్య్ అనూప్॥ 18

తా॥ 'నేను దేనిని పరిత్యజించుటలేదు. మఱి వాంఛించుటయును లేదు. నేను కేవల బ్రహ్మస్వరూపుడను' ఈ నిశ్చయమే సత్యమైనది. మఱియు నేను సర్వాత్మస్వరూపుడనగుటచే అస్థిమాంస రక్తసముదాయమగు శరీరమును నేనే. అనగా ఆత్మజ్ఞాని దృష్టిలో శరీరాదులేవియు తనకంటె వేరుగ లేవు. అన్నిటిని బాధించి అద్వైతబ్రహ్మమే తానగుచున్నాడు.

దోహా॥ హీనధర్మ్ సబ్ కూటసమ్ నిత్యముక్త్ అవికార్।
ఏక బ్రహ్మ జగ్ బాధ్ సబ్ యహీ ధారణా ధార్॥ 19

తా॥ 'నిర్ధర్మకమై కూటస్థమైనట్టియు, సర్వత్ర సమమై దోషరహితమైనట్టియు, నిత్యముక్త నిర్వికారాద్వయమగు పరబ్రహ్మమును నేను. బ్రహ్మాతిరిక్త సమస్త ప్రపంచము బాధితమైనది' అను యిట్టి దృఢనిశ్చయమే నిత్య నిరతిశయ మోక్షప్రదమైనది. కాన ముముక్షువులందరు యిట్టి బ్రహ్మాత్మత్వ నిశ్చయ దార్ఢ్యముకొఱకై అనవరతము ప్రయత్నింతురుగాక.

ఓమ్ శాంతిః శాంతిః శాంతిః.

---

శ్రీవేదవ్యాస ప్రెస్, చిత్తూరు.